వేధదోషే షడ్వర్షేబ్రయతే స్వామీగతశ్రీః నవమేభవేత్
చతుర్థేపుత్రనాశస్య సర్వనాశతథాష్టమే. 97

97 అట్టివేధాదోషమువలన ఆరవయేట గృహయజమానునికి మరణము కల్గును. తొమ్మిదవయేట సంపదనశించును. నాల్గవయేట పుత్రనాశనముకలుగును. ఎనిమిదవయేట సర్వనాశమగును.

పక్షీణమాసేనబుతుత్రయేన సంవత్సరేణాతిఫలం విధత్తే
శుభాశుభం క్షేమమిదం బుధైస్తు నాతఃపరం తత్రివిచారమస్తి. 98

98 బుద్ధిమంతులగు విద్వాంసులచే పక్ష, మాస, షాణ్మాసిక, వర్షఫలము లీతీరున చెప్పబడినవి. అంతకుపైన విచారించనక్కరలేదు.

మాతంగోదక్షిణేభాగే పూర్వేపశ్చాత్తధోత్తరే
సింహావిధత్తేమరణం పుత్రాణాం దోషదం మహత్. 99
పూర్వేవృషం తథాతోయేధ్వజం దోషకరంమహత్
ఇతికంఠీరవోగేహశాయామ్యాపశ్చిమదిక్స్థితౌ. 100

99-100 దక్షిణభాగమున మాతంగములను పూర్వపశ్చిమోత్తరములందు సింహములను నిల్పిన మరణమును పుత్రదోషమును సంభవించును. (అనగా ఆయా శాలలు లేక గృహములు నిర్మించరాదు) మరియును తూర్పున వృషములను, పశ్చిమమున ధ్వజమును నిల్పిన మహత్తరమగు దోషము కల్గును. కంఠీరవగేహముకూడ నిల్పి యామ్యాపశ్చిమముల నొనర్పరాదు.

పూర్వోత్తరే ధ్వజోయానా మ్మహాపీడాకరామతౌ
జంబీరైఃపుష్పవృక్షైశ్చ పనసైర్దాడిమైస్తధా. 101
జ్యాతీభిర్మల్లికాభిశ్చ శతపత్రైశ్చ కేసరైః
నాళికేరైశ్చపుష్పైశ్చ కర్ణికారైశ్చ కింశుకైః. 102

101-102 జంబీరము, పుష్పవృక్షములు - పనసలు - దాడిమివృక్షములు జాతీ-మల్లిక- శతపత్రము- కేసరము- నారికేళము మొదలుగాగల

వృక్షములతోడను సర్వవిధములగు పుష్పవృక్షములతోడను పరివేష్టిత మగు వనము నరులకు మహత్తరమగు సౌఖ్యమును కలుగజేయును.

వేష్టితంభవనం న్రూణాం సర్వసౌఖ్యప్రదాయకం
ఆదౌవృక్షాణివిన్యస్య పశ్చాద్గృహాణి విన్యసేత్. 103

103 ముందుగా వృక్షములనునాటి అటుపిమ్మట గృహమును నిర్మించవలెను.

అన్యథాయదికుర్యాత్తు తద్గృహంనైవశోభనం
నగరం విన్యసేదాదౌ పశ్చాద్గేహాని విన్యసేత్. 104

104 ఇందుకు భిన్నముగా నొనరించినచో అట్టిగృహమునకు శుభము కలుగదు. ప్రథమమున నగరమును నిర్మించి, పిదప గృహములు కట్టవలెను. అందు వ్యత్యస్తముగా నొనరించిన అనగా ముందిండ్లు, పిదప నగరము నిర్మించిన శుభములు కలుగనేరవు.

అన్యథాయదికుర్వీణ స్తదా నశుభమాదిశేత్

పీతాధపూర్వే కపిలాహుతాశేయామ్యేచ కృష్ణానిఋతౌచ శ్యామా
శుక్లాప్రతీచ్యాం హరితాధవాయౌ శ్వేతాధసౌమ్యేధవళాచ ఈశే 105

ఈశానపూర్వయోర్మధ్యే శ్వేతాపశ్చిమనైఋతే
తయోర్మధ్యే రక్తవర్ణాపతాకా పరికీర్తితా 106

105-106 పూర్వదిక్కున పీతవర్ణముకలట్టియు, ఆగ్నేయమున కపిలవర్ణమైనట్టియు, దక్షిణమున నల్లనైనట్టియు, నైఋతిదిక్కున శ్యామలవర్ణము కలట్టియు, పశ్చిమమున తెల్లనైనట్టియు, వాయువ్యమున హరితవర్ణముకలట్టియు, ఉత్తరమున తెల్లనైనట్టియు, ఈశాన్యమునకూడ ధవళమైనట్టియు, ఈశానపూర్వభాగముల మధ్య తెల్లనైనట్టియు, పశ్చిమనైరుతుల నడుమ రక్తవర్ణమైనట్టియు పతాకముల నలంకరింపవలెను.

సర్వవర్ణాతథామధ్యే పతాకాం కింకిణీయ్యుతా
బాహుప్రమాణ కర్తవ్యా స్తంభం బాహుప్రమాణకం 107

107 సర్వవర్ణములగు పతాకముల నడుమ హికిణినుంచవలెను. బాహుప్రమాణముగా స్తంభము నిర్మింపవలెను. దానికి చిరుగంటలను కట్టవలయును.

యత్ ద్వారమార్గే పూర్వేతుధ్వజః షోడశహస్తకః
స్తంభోశ్యవిధివత్ స్థాప్యః సఘంటాభరణీకృతః 108

108 ద్వారమార్గమున, తూర్పుదిశను, పదునారుహస్తముల ప్రమాణముగల ధ్వజస్తంభమును స్థాపించవలెను. అయ్యది విధ్యుక్తముగా నిలుపవలెను. అందు భరణీసంయుతమగు ఘంటను నిల్పవలెను.

పుష్పమాలాన్వితః స్థాప్యోద్వారమార్గేణదక్షిణే
ఇతిప్రోక్తం వాస్తుశాస్త్రం పూర్వగర్గాయధీమతే 109
గర్గాత్పరాశరః ప్రాప్తస్తస్మాత్ ప్రాప్తబృహద్రథః
బృహద్రథాద్విశ్వకర్మాప్రాప్తవాక్ వాస్తుశాస్త్రకమ్ 110
సవిశ్వకర్మాజగతో హితాయకథయత్పునః
వాసుదేవాదిషు పునర్భూలోకం భక్తితోబ్రవీత్ 111

109-111 ద్వారమార్గమునకు కుడిప్రక్క పుష్పమాలాదుల నలంకరింపలెను. ఈవాస్తు శాస్త్రము పూర్వము గర్గమహర్షి పరాశరునకు చెప్పెను. పరాశరునివల్ల బృహద్రథునకు ప్రాప్తించెను. ఆతడు విశ్వకర్మకుపదేశించెను. విశ్వకర్మ జగదుపకారమునకై తిరుగా అద్దానినిచెప్పెను. అది వాసుదేవాదులు భక్తితో భూలోకమునందు వ్యాపింపజేసిరి.

ఇదం పవిత్రం పరమం రహస్యం యః పఠేన్నరః
తస్యాదవితథావాణీసత్యం సత్యం వదమ్యహమ్ 112

112 పవిత్రమైనదియు, పరమరహస్యమైనదియు నగు యీవాస్తు శాస్త్రమును చదివినవరులకు సరస్వతీప్రసాదము లభించును. ఇది ముమ్మాటికిని నిశ్చయము.

అధసువిమలవిద్యో విశ్వకర్మామహాత్మా సకలగుణవరిష్టః
సర్వశాస్త్రార్థవేత్తా సకలసురగుణానాంసూత్రధారం కృతాత్మా
భవననివసతాం సచ్ఛాస్త్రమే తచ్చకార. 113

113 సకలసద్గుణ సంపన్నుడును, సర్వశాస్త్రవేత్తయును విమల విద్యారహస్యకోవిదుడును అగు మహాత్ముడైన విశ్వకర్మ, సకలదేవతలకును సూత్రధారుడైన యాతడు ఈసచ్ఛాస్త్రమగు వాస్తుశాస్త్రమును రచియించెను.

ఇతిబ్రహ్మోక్త విశ్వకర్మప్రకాశే విశ్వకర్మణోక్త వాస్తుశాస్త్రే త్రయోదశోధ్యాయః ఇతివిశ్వకర్మప్రకాశః సంపూర్ణః.

సంపూర్ణము.